శ్రీ

ఉన్నవ

# వీరాంజనేయ శతకము

ఉన్నవ రామకృష్ణ ప్రణీతము

మొదటికూర్పు : 500 ప్రతులు.

చీరాల,

శ్రీ రామకృష్ణా ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1939

 [వెల రు 0-2-0

శ్రీ

ఉన్నవ

# వీరాంజనేయ శతకము

ఉన్నవ రామకృష్ణ ప్రణీతము

మొదటికూర్పు : 500 ప్రతులు.

చీరాల,

శ్రీ రామకృష్ణా ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1939

 • [వెల రు 0-2-0

శ్రీ

ఉన్నవ

# వీరాంజనేయ శతకము

సీ॥ శ్రీరామసేవక! శ్రితజనరక్షక!
భక్తాళిపోషక! ప్లవగముఖ్య!
నిగమార్థవేద్యక! నిశ్చలస్వాంతక!
పరమార్థదాయక! వరవివేక!
సుగుణాలవాలక! సురముని స్తోత్రక!
దాసాళిపాలక! దయనిధైక!
భవబంధవారక! బ్రహ్మాండనాయక!
యాపన్నివారక! యసురహాతక!

సుజనపోషక! సుశ్లోక! శోకహాతక!
అభయదాయక! శాకినీ యరివిపక్ష!
హరిపద విధేయ! ఉన్నవపుర సుగేయ!
అఖిల రిపుకులాజేయ! వీరాంజనేయ!!

సీ॥ బ్రహ్మాదిదేవాదక్ష! రాక్షసాళి విపక్ష!
కపుల సైన్యాధ్యక్ష! కల్పవృక్ష!
పండితకులపక్ష! భక్తజనాపేక్ష!
దిననాయక సదృక్ష! త్రిదశరక్ష!
రామకార్య సుదీక్ష! రావణ కులశిక్ష!
పుణ్యపాప విచక్ష! బుధులదృక్ష!
మునికుల సంరక్ష! పూర్ణదయావీక్ష!
భుజశౌర్యబలదక్ష! సుజనమోక్ష!

అతుల కరుణాకటాక్ష! పద్మాయతాక్ష!
పరమతారక సంత్రాక్ష! వరవిమోక్ష!—హరి॥

సీ॥ జనకజా ర్తిహారాయ! జగదాధిపత్యాయ!
చిరకాల జీవాయ! శ్రీనికాయ!
చిదూ్రపకారాయ! శ్రీ విశ్వరూపాయ!
కామనివారాయ! ఘనయశాయ!
సుగ్రీవమిత్రాయ! శోభితాకారాయ!
రఘురామ భక్తాయ! రమ్యకాయ!
పీతాంబరధరాయ! ప్రేమస్వరూపాయ!
వజ్రశరీరాయ! వైభవాయ!

శ్రితజనాభీష్టదాయ! సత్సేవితాయ!
దీర్ఘవాలాయ! విక్రమతేజకాయ!—హరి॥

సీ॥ రాజభక్తుండవు రాజతాంత్రికుఁడవు
సుగ్రీవు బంటువు శోభితుఁడవు
సాహసాంకుండవు సత్యవ్రతుండవు
సుగుణగణ్యుండవు శుభకరుఁడవు
కపినాయకుండవు గౌరవార్హుండవు
విమలహృదయుఁడవు విశ్రుతుఁడవు
క్రూరసంహారుఁడవు వీరవరుండవు
దైత్యాంతకుండవు ధార్మికుఁడవు
కీర్తివంతుఁడ వీవు సంకీర్తనుఁడవు
శాశ్వతుండవు సర్వవిశారదుఁడవు—హరి॥

సీ॥ సర్వనుతశరీర! శాఖామృగాకార!
అరుణాస్య గుణధీర! యఘవిదూర!
భూతాదికనివార! భూరిశౌర్యోదార!
మునిమానసవిహార! మోక్షకార!
ధూమాక్షసంహార! దూతకార్యాధార!
సకల విద్యాసార! చారుహార!
నిగమార్థగోచర! నిఖిలసన్నుతశూర!
ముల్లోక హితకార! మోహదూర!
రామకార్యధురంధర! రణవిహార!
అసుర భీకర పటుశౌర్య! యమిత ధైర్య!—హరి॥

సీ॥ శ్రీ వీరహనుమంత! చిన్మయ గుణవంత!
మంజుల సుస్వాంత! మతి నియంత!
దానవాళి కృతాంత! ధైర్య శౌర్యోదంత!
అతుల విస్తరశాంత! యోగమాంత!
భూతాదికవధాంత! భూరి రోగనిహంత!
వర సుగుణాకాంత! వైరిహంత!
సకల మేధావంత! సన్మునీ హృద్యాంత!
కిన్నరీ గణమంత్ర! కీర్తివంత!
అతుల సర్వస్వతంత్ర! విద్యాప్రదాంత!
సాధురక్షణ గుణతంత్ర! సత్స్వతంత్ర!—హరి॥

సీ॥ శ్రీరామ పద సరసీరుహంబుల నెప్డుఁ
గొలువంగ వ్రతమెద్ది సలిపినావొ!
శ్రీరామ రూపవిశేషంబు సతతంబుఁ
గాంచ నే పుణ్యంబుఁ గడపినావొ!
శ్రీరామ భద్రసుస్మేరాననవుఁ బల్కు
విన ధర్మమేమిఁ గావించినావొ!
శ్రీరాము పజ్జన గారాబమునఁ జెల్మి
సేయంగఁ దపమేమి జేసినావొ!
రాము కార్యంబుకైఁ బుట్ట నేమి జపముఁ
జేసినాడవొ! నీ భక్తిఁ జెప్పరాదు!—హరి॥

సీ॥ శ్రీరామపద సరసీరుహంబులఁ దేనెఁ
గ్రోలు భృంగమగాను కేలొనర్తు
శ్రీరామనామ సచ్చింతనామృత గాన
లోల భృంగమగాను కేలొనర్తు
శ్రీరామ హృదయాబ్జసీమావిహారవి
లోలమా భృంగమ కేలొనర్తు
శ్రీరామనయన రాజీవాశ్రయానంద
లోలమా భృంగమ కేలొనర్తు
పదములందుఁ బ్రసూనముల్, మదిని రూప
ములను నిల్పెడి భృంగమ మ్రొక్కులిడుదు—హరి॥

సీ॥ శ్రీరామ పాదరాజీవమాధురి రుచిఁ
దవిలి తీపినిఁగొన్న దైవమీవు
శ్రీరామ దివ్యసుశ్రీరూపమునుఁగన్న
తీపినిఁగొన్న తాంత్రికుఁడవీవు
శ్రీరామనామ సత్పారాయణపుఁ దేనెఁ
ద్రావి తీపినిఁగొన్న తండ్రివీవు
శ్రీరామ వచనవిస్తారపీయూషంబుఁ
గ్రోలి తీపినిఁగొన్న కుశలుఁడీవు
రోమకూపంబులన్నియు రామనామ
మధువుచే నిండి పండిన బుధుఁడవీవు—హరి॥

సీ॥ మహీ భక్తరత్నాళి మణిపూసవంచని
కీర్తినొందిన భక్తిమూర్తివీవు
దాసవరులలోఁ బ్రథమగణ్యుఁడవటంచు
నిండు పేర్గన్న దాసుండవీవు
దూతలలో నెల్ల దొడ్డదూతవటంచుఁ
బ్రతిభఁగాంచిన దూతపతివి నీవు
సేవకావళిలోన సేవాభిముఖుఁడంచుఁ
బ్రఖ్యాతిఁగొన్న సేవకుఁడవీవు
పేర్మి శ్రీరామభక్త-శ్రీరామదాస-
రామదూతవు-సేవకరాజువీవు—హరి॥

సీ॥ నీ పాదయుగళిని నేఁ బట్టుకొందును
పరిచర్యఁజేయుట సరగనేర్పు
నీరూప మనిశంబు నే నిల్పుకొందును
భక్తిభావంబులఁ బరగనేర్పు
నీనామమెప్పుడు నే గానమొనరింతు
నానందతత్త్వంబు నరయనేర్పు
నీ సుగుణాళిని నే ధ్యానమునుసేతు
పరహితకార్య తత్పరతనేర్పు
నిన్నుఁ గనుగొందు నేకైకనిష్ఠతోడ
జ్ఞానమును నేర్పు, మోక్షసుశ్రీనిఁగూర్పు—హరి॥

సీ॥ నీ పరిచర్యల నేర్పునకైఁ గాదె
సేవకుఁ దనపత్నిఁ జీరమరచు
నీ నిర్మలస్నేహ నిక్షేపమునఁగాదె
తన సోదరాళినిఁ దలఁపమరచు
నీ భక్తిగుణ ధ్యాన నియమంబుననుఁగాదె
యారేడులోకంబు లేలమరచు
నీ బాహుబలదర్ప నిష్పత్తినింగాదె
తన విక్రమంబు నంతయును మరచు

రామభద్రుండు-త్రైలోక్యరక్షకుండు
నీ ప్రభావంబు నింక వర్ణించుటెట్లు?—హరి॥

సీ॥ నీ పరిచర్యల నిష్ఠతోఁ జేతును
శ్రీరామవిభునకుఁ జెప్పుమయ్య
నీ నామముదలఁతు నిశ్చలభక్తిమె
శ్రీరామవిభునకుఁ జెప్పుమయ్య
నీ రూపమునుఁ జిత్తసారూప్యముగఁ జేతు
శ్రీరామవిభునకుఁ జెప్పుమయ్య
నీ బంటుగానుందు నెమ్మితో నాకోర్కె
శ్రీరామవిభునకుఁ జెప్పుమయ్య

'భక్తి నిన్నించు, సుగుణ సంపత్తినించు
కరుణరక్షింపు'మంచు-విఖ్యాతచరిత!—హరి॥

సీ॥ అనిశంబు నీ చరణాబ్జముల్ బూజింతు
నవ్యాజకృపఁజూప నరుగుదెమ్మ
అనుదినంబును నీ శుభాకృతిఁ గననెంతు
సాక్షాత్కరింపఁగ సాగిరమ్మ
అనయంబు నీ నామమునుఁ బ్రీతిగణియింతు
నియతితో హృత్పీఠి నిలువరమ్మ
అశ్రాంతమును నీ ముఖాబ్జచందురునిఁగాంతుఁ
గరుణార్ద్రదృష్టితో నరయరమ్మ
చిఱునగవుతోడ ననుఁజూడఁ జేరరమ్మ
పిల్లవాఁడని పిలువఁగాఁ బ్రేమరమ్మ—హరి॥

సీ॥ పావనంబైన నీ పాదధూళిని నాదు
శిరముపై నుంచుమీ శ్రేయ మొప్ప
శుభమగు నీరూపు స్ఫుటముగా నా చిత్త
మందుంచుమీ మోక్షమట్టె యొలుక
కల్పశాఖినిఁబోలు కరము నాపై నుంచు
కామితార్థంబుల గణములబ్బ
అమృతాకరంబగు నక్షిద్వయంబును
నాదిక్కుఁ బ్రసరింపు మోద మెసఁగ
శిరముఁ బంకించిగనుము వాంఛితముగలుఁగ
చిఱునగవుతోడ మాట్లాడు చింతదొలఁగ—హరి॥

సీ॥ వానరవరుఁడని వట్టివాఁడందునా
దేవతావరములఁ దీయుటొకటి
కోఁతివాఁడంచని చేఁతగాదందునా
గాలించి సీతనుఁ గాంచుటొకటి
ప్లవగవిభుఁడని పస్తుచూపందునా
యోషధీంద్రముఁ దెచ్చి యుంచుటొకటి
హరికులోత్తముఁడని యాటలాడందునా
నిగమాంతమునుఁ గని నేర్చుటొకటి

సాక్ష్యములుగాఁగ నీశక్తి జగతియెఱుఁగు
నెఱుకఁగలవాఁడ ననుఁబ్రోవ వెఱఁగిఁకేల—హరి॥

సీ॥ తోఁకవాఁడని నీకు దూరముండుందునా
పండుగా నిను నోటఁ బట్టుటొకటి
వనచరుఁడని నిన్ను వదలుదమందునా
బ్రహ్మచర్యపుదీక్షఁ బరఁగుటొకటి
శాఖామృగమవని సరిపుచ్చుకొందునా
భక్తియుక్తులతోడఁ బ్రబలుటొకటి
కపికులుఁడని నిన్నుఁ గనఁజాలనందునా
విశ్వరూపంబున వెలయుటొకటి

యిట్టి నీ మహిమంబు లెన్నేనిఁగలవు
నిన్ను నమ్మితి దయఁజూడు నిర్మలాత్మ!—హరి॥

సీ॥ రుద్రాంశమున విశ్వరూపుండవై యొప్పి
దనుజాళి మర్దించి దనరుటొకటి
బ్రహ్మాంశమునఁబుట్టి బ్రహ్మయువై బ్రహ్మ
చర్యంబుననునిల్వఁ జాలుటొకటి
విష్ణ్వాంశమున లోకవిహితంబుఁ గావింప
భక్తాళికల్పమై బరఁగుటొకటి
పవనాంశమున హెచ్చు బలియుండవై సర్వ
జన రంజకుండవై సాగుటొకటి

గాఁగ శుభలక్షణాన్విత గతిఁదలిర్ప
నంజనీ కేసరులకు నీ వవతరిలవె!—హరి॥

సీ॥ నీ సుస్వరూపంబు నేఁగాంతుఁ గనులారఁ
బ్రత్యక్షముగరమ్ము పవనతనయ!
నీ వాక్యమాధురి నేవిందుఁ జెవులార
నాదరంబునఁ బల్కు మాంజనేయ!
నీనామ జపమును నేఁజేతు మనసార
లేశ మోరిమిఁజూపు కీశముఖ్య!
నీ కృపిగంతుల నేనెంతుఁ దనివార
నుంత జూపుము హనుమంతదేవ!

నీ కృపామృతధార పానీయమిమ్ము
భక్తిఁ గడుపారఁద్రావుదుఁ బ్లవగముఖ్య!—హరి॥

సీ॥ బ్రహ్మాండభాండమహా ప్రపంచకమునందు
అణువులో నణువైతి నాదరింపు
నిను భక్తిఁగొల్చెడి నిశ్చలభక్త స
మ్ముఖమందు నణువైతి ముదమునింపు
వేదశాస్త్రపురాణ వివిధార్థ కోవిద
శ్రేణిలో నణువైతిఁ జిత్తగింపు
సకల చరాచర జంతు సంతాన సం
ఘంబులో నణువైతిఁ గరుణఁ బెంపు
సేవకాళిలో నణువైతి స్వీకరింపు
సారెసారెకుఁ ద్వత్పదార్చనముసేయ—హరి॥

సీ॥ శ్రీరామనామంబుఁ జిత్తమందుఁ దలంప
వజ్రదేహుండవై వరలితివట!
శ్రీరామనామంబుఁ బారాయణముసేయఁ
జిరకాలజీవివై చెలఁగితివట!
శ్రీరామనామ విశేషంబుఁ బఠియింప
ననుపమ జయముచే నలరితివట!
శ్రీరామనామంబు స్థిరముగా జపియించి
నిత్యసౌఖ్యంబున నెగడితివట!
సర్వశక్తులు గల్గిన సాహసివట!
నాకు నేర్పుము నీభక్తి నమ్మినాను—హరి॥

సీ॥ సంజీవిఁ దెమ్మన సకలమూలిక పర్వ
తముఁ దెచ్చి వైచిన దాతవీవు
జనకాత్మజాత యేచక్కి నున్నదో సుంత
గాంచి రమ్మన లంకఁ గాల్చితీవు
ఆగంతకుఁ డెవఁడో యరసి రమ్మని పంప
సఖ్యంబుఁ జేసిన స్వామివీవు
వననిధిదాటంగ పథముఁ గాంచుమటన్న
వారధిఁ గట్టిన నలుఁడవీవు
కార్యసఫలత, విమల గాంభీర్యగుణము,
నలఘు మైత్రియు నతిశక్తిగల మహాత్మ! — హరి॥

సీ॥ సుజనసాంగత్యంబు శుభమను కోరిక
నొప్పిన కపులలో నొక్కరుఁడవు
భక్తిసాధనచేత భగవంతు వీక్షించి
యుండిన ప్లవగాళి నొక్కరుఁడవు
తత్త్వార్థము నెఱింగి ధరణీశుఁ గనుఁగొని
యున్న వానరతతి నొక్కరుఁడవు
పరహితకార్య తత్పరవిలాస శుభగు
ణోన్నత కీశాళి నొక్కరుఁడవు
మర్కటేందురిలలో నెల్ల మహిమ, కీర్తి,
ఘనతలనుఁ గన్నవాఁడ వొక్కరుఁడవీవె! — హరి॥

సీ॥ మనుజజన్మంబెత్తి మనసు నిల్పఁగనైతి
కోఁతినై నాకంటెఁ గోవిదుఁడవు
నరుఁడనై భగవంతు నరసి గన్గొననైతి
వానరా! నాకంటె జ్ఞానివీవు
మానవాభిఖ్యుఁడనై మహిమ నేర్వఁగనైతి
మర్కటా! నాకంటె మాన్యుఁడీవు
జనుఁడనై వేదశాస్త్రములఁ జదువనైతి
హరికుల! నాకంటె ననఘుఁడీవు

వ్యక్తిగల్గియు నీ దివ్య పాదధూళి
కైన సరిబోలనైతి-భక్తాగ్రగణ్య!—హరి॥

సీ॥ సజ్జనసాంగత్యసారంబు గ్రహియించి
పెద్దలసేవలఁ బెనఁగినావు
భక్తిమార్గం బతి ప్రాముఖ్యమంచని
బరమేశు పాదముల్ బట్టినావు
తత్వమార్గమరసి సత్వప్రధానివై
విజ్ఞానపథమున వెలసినావు
వైరాగ్యమహిమచే వర్ధిల్లి సగుణ ని
ర్గుణ దర్శనంబులఁ గుదిరినావు

నీవె జ్యోతిస్స్వరూపమై నిర్మలముగ
వెలిఁగినావు సూక్ష్మస్థూల విధులెఱింగి—హరి॥

సీ॥ కఠినకంటకయుత కాంతారముల దాటి
సీతనుఁ గనుఁగొన్న దూతయెవఁడు?
విక్రమదోర్దండ వీరవర్యులఁ జెండి
ఖ్యాతిగాంచినయట్టి దూతయెవఁడు?
స్వామి కార్యార్థమై సాగరమ్ములదాటఁ
బ్రీతితోఁ బూనిన దూతయెవఁడు?
ముమ్మూర్తుల కజేయ ముదిత శిరోమణి
జ్యోతి రాముకిడిన దూతయెవఁడు?

నీవెకా ధాత్రిజారామదేవవరులఁ
దెలసి సద్భక్తిఁ గొలిచిన యలఘుమతివి—హరి॥

సీ॥ సుగ్రీవు నమితశోభగ్రీవు మైత్రికి
మించి సామ్రాజ్య మేలించినావు
శ్రీరాము శుభగుణశ్రీరాము కరుణకు
లీలగా లంక గాలించినావు
సీత వినుతయశోపేత సంప్రీతికిఁ
దివిరి దనుజుల మ్రందించినావు
లక్ష్మణు నతిధైర్యలక్ష్మణు జెల్మికి
విగత మూర్ఛితుని గావించినావు

అడుగుమాత్రన వారిఁ గృతార్థులనుగఁ
జేసితివి నా వినతి వృధసేయుటెట్లు?—హరి॥

సీ॥ వాలి సుగ్రీవులు వైరంబుతోనుండ
నీతి బోధనుజేసి నిలుపలేదె?
అన్న శౌర్యంబుకై నదర సుగ్రీవుండు
శుభమగు ఋష్యాద్రిఁ జూపలేదె?
శ్రీరామ లక్ష్మణుల్ సీతాలతాంగిని
వెదకుచు రా గౌరవింపలేదె?
శుభదాయకంబుగా సుగ్రీవ రఘువీర
వరులకు మైత్రి నేర్పరుపలేదె?

కపికులేశునకుఁ బట్టంబుఁ గట్టలేదె?
ననుఁ గృపాన్వితమతిఁ గాంచుటనగ నెంత?—హరి॥

సీ॥ సుగుణాకరుండును సూనృతాచరణుండు
నత్యంత భూతదయాకరుండు
నగు రాము వీక్షించి యంజలి గావించి
బరిచర్యసేయుచుఁ బరఁగుచుండ
సీతఁ గన్గొన కపి శ్రేణిఁబంపుచు నీదు
కార్యదీక్షఁ దలంచి ఘనయశుండుఁ
బ్రేమతోడుతఁ బిల్చి రామముద్రిక నిచ్చి
తత్కార్యకరణవిధంబుఁ బూను

మనఁగఁ దరులను గిరులను నట్టిదాఁటి
తహహా నీ స్వామిభక్తి నేమనఁగవచ్చు?—హరి॥

సీ॥ సంపాది దెలుపంగ జానకి మార్గంబు
సంద్రంబుదాటంగ శక్తిలేక
కపులెల్లఁ దమ బలక్రమములఁ దలఁపోసి
వీరవర్యుఁడులేడె వేగ నుఱుక
నని చింతనొందంగ నట్టహాసముఁజేసి
విశ్వరూపంబున వెలసి లీల
లంఘించి సంద్రంబు లంక కే సరిగెద
సీతవార్తనుఁదెత్తు శీఘ్రరీతి
ననుచు బ్రహ్మాండభాండంబు నావరించి
జనవె భీకరరూప ప్రసంగవృత్తి—హరి॥

సీ॥ శ్రీరామనామంబుఁ జిత్తంబులోపల
స్మరియించుచును మింటి కరిగినావు
శ్రీరామరూపంబు జెలఁగి ముందాడంగ
వనధిపై లంఘించి వరలినావు
రామభక్తుఁడవంచు రంజిల్లి మైనాకుఁ
డాహ్వానమీయంగ నరిగినావు
జానకీదేవికై జనెదుఁని సురస
యడ్డంబుఁ దగులంగ నణచినావు
సులభముగదాఁటి సంద్రంబు శుభకరంబుగ
వలమువేలాద్రి నెక్కితివౌర హనుమ!—హరి॥

సీ॥ రామకార్యార్థమై భీమరూపంబునఁ
జనువాఁడెవండని సాగి సురస
భూనభోంతరములు భోరునఁ జెలఁగంగఁ
దనువుఁ బెంచియు వేగఁ దనర వరుస
ద్విగుణీకృతాకృతి దిక్తటంబులు నిండ
హెచ్చు బలంబున నేఁగనరసి
తన గహ్వరంబును దద్దటిల్లఁగ సర్వ
దిక్కులకునుఁ బెంచి నిక్కి మెరసి
మశకరూపంబు వహియించి, మాయనించి,
కుక్షిఁ జీల్చియు సురసను గూల్పలేదె?—హరి॥

సీ॥ ఆ సువేలాద్రిపై నరుణుండు గ్రుంకిన
దాఁక గూర్చొనియుండి దరలి వేగ
నతిరదుర్గమమైన లంకాపురీ
విభవంబుఁ గన్గొని వేడ్క సెంది
కోటవాకిలిఁ జొచ్చు ఘూర్ణిల్లి లంఖిణి
భీమరూపంబునఁ బెనఁగిలాగ
విసరివేయఁగ వెలి వింతరూపంబున
ద్వారంబు గడవంగ తల్లడిలఁగ
నరచి చేఁబట్టి వేయంగఁ దిరుగఁ ద్రిప్పి
ముష్టిచే ఓమ్ముఁబొడువంగ 'మొట్టో' యనదె—హరి॥

సీ॥ లంకాపురాంగన లంఖిణిఁ బడఁగూల్చి
కోట లీలగఁజేరి గోప్యముగను
సౌధాంతరంబులు సౌందర్యశాలలు
రత్నకోవెల సుమారామములును
విద్యుత్ప్రభోద్దీప వేదిక మంటప
నవగోపురంబులు నలుగడలును
రావణాసురవరు రమ్యహర్మ్యంబులు
గాలించి మిక్కిలి గష్టమునను
రాముదేవిని గాన కారాటపడుచు
వెదకుచు నశోకవనమును వేడ్కఁగనవె!—హారి॥

సీ॥ లంకాపురి వెదకి శంకాన్వితస్వాంత
మున నచటి యశోకవనముఁజొచ్చి
యందుఁ జూచుచుఁబోవ 'హా రామ-హా రామ'
యను నార్తనాదంబు నాలకించి
సంతసంబునఁ జెవి సారెసారెకు వంచి
విని రామనామంబు వే నుతించి
తన్మయావస్థలో 'దాశరథీ-రామ'
యంచు శబ్దముజాడ నరుగుదెంచి
త్వరగఁ గాంచవె శ్రీరామ ధర్మపత్ని
నచట వృక్షపుఁ గ్రీనీడ హార్ద్రమునను—హారి॥

సీ॥ శ్రీ జానకీదేవి జీర్ణశల్యములతో
జీర్ణాంబరముఁగట్టి 'శ్రీరఘువర'
యని బల్కుచును లేచి యాక్రందనముఁజేసి
మెల్లన కేశముల్ మెలచి చీర
చెరఁగుతో బంధించి చేర్చి గళముఁగట్టి
'శ్రీరామ-శ్రీరామ-సీత యసుర
నాయకుపురిలోనఁ బ్రాయోపవిష్టయై
చావనున్నది మీరు గావలేరె?'

యనుచు నురిఁబడుతఱి నీవు ఘనతనేఁగి
రామముద్రికనీయవె రమణి కపుడు!——హరి॥

సీ॥ శ్రీరామముద్రకుఁ జిత్తంబు హర్షింపఁ
బరికించి ప్రాణంబుఁ బల్లవింపఁ
జేకొని ముద్రిక 'శ్రీరామ' యని బొంగి
వినుతించి 'నిన్నును విశ్వసింప
నిజరూపుఁజూపుము నిశ్చింతతోనుందు'
నన విశ్వరూపంబుఁ గనఁగఁజేయ
నాశ్చర్యమునుఁజెంది 'హనుమంత నీరూపుఁ
దగ్గింపు'మని సీత తగనుతింప

సూక్ష్మరూపావఁ గోఁతివై జోతలిడవె
రామవార్తలఁ జెప్పియు క్షేమమనవె!——హరి॥

సీ॥ రామవృత్తాంతంబు రామకుబోధించి
రమణివృత్తాంతంబు రఘువరునకుఁ
జెప్పంగ జానకి శిరశిరోభూషణం
బుత్సాహమునవిచ్చి 'యొక్కనెలకు
రాకున్న చత్తును రాఘవునకుఁ దెల్పు'
మని చెప్ప రంజిల్లి యవనిసుతకుఁ
బ్రణమిల్లి, 'తినుటకై ఫలముల నిమ్మ'న
'వనమందుఁ గొనుమ'న్న ఘన యశోక

వనమునం బండ్లుఁదిని రావణునకు నీదు
రాక దెలియఁజెఱచితి వారాముమపుడు—హరి॥

సీ॥ ఆ యశోకవనము నట్లు ధ్వంసముఁజేసి
పారకై చియు మంచి పండ్లుమెక్కి
కావలివారలఁ గడిమిచేఁ దరుమంగఁ
బారి రావణు దరిఁజేరి మ్రొక్కి
'మర్కటరూపుండు మన యశోకవనంబుఁ
జెరికి మమ్ములఁ గొట్టితరిమె' ననఁగ
'ఆతనిఁ బట్టితెం'డంచు రావణుడంత
శౌర్య దైత్యులఁబంప స్తంభమెక్కి

వారిఁ జంపవె రావణుఁ 'జూర! కోఁతి
యేమి-దనుజవరులఁ గూల్చుటేమి?' యనఁగ—హరి॥

సీ॥ రోషకషాయిత రూక్షేక్షణుండయి
వీరభటులఁ బంపి వేగఁబట్టి
తిట్టి కొట్టించఁ దివిరి రక్కసిమూక
వచ్చి విజృంభింప వారిదిక్కు
వీక్షించి వాలంబు విస్తరంబుగఁ బెంచి
దనుజగాత్రములకుఁ దగ ఘటించి
నేలఁ బడంగొట్ట చాల రాక్షసపంక్తి
మృతిఁజెందె నవ్వేళ, మేటిజెట్టి
నీవటంచునుఁ దెలియ నుర్వీస్థలాన
భీతిగలుగంగ నుంత నీ పేరువినఁగ—హరి॥

సీ॥ దిగులొంది రావణుఁడొగిని మంత్రులఁజూడ
నక్షయసుతుఁడు తా నడ్డువచ్చి
తనదు శౌర్యముఁజెప్పి తండ్రికి మ్రొక్కి 'నే
కోఁతి నిప్పుడదెచ్చి ప్రీతిహెచ్చ
మీ కిత్తు'ననుచును మేటి సైన్యముఁగూడి
బాణవృష్టిఁగురియ బలము మెచ్చి
ధ్వజముఁగొని దనుజవరులనుఁ జెండాడి
యక్షయుఁ గూల్చఁగా నట్టిహెచ్చి
కోఁతులనుఁజూప నసురులు గోడుపడరె!
నిర్జరులు సంతసంబున నిన్నుఁబొగడ—హరి॥

సీ॥ ముజ్జగంబులగెల్చు ముద్దుకుమారుని
మరణంబువిని శోకభరముచేత
భూమినిఁ బొరలుచు భోరున నేడ్వంగ
మేఘనాధుఁడువచ్చి మిగులఁ దాతఁ
దగ నూఱడించియు ధైర్యంబుఁగొల్పియుఁ
గపికులాధమునిప్డు గట్టి చేతఁ
గొనివత్తునని యాజ్ఞఁగొని వైభవంబునఁ
దరలి మిమ్ములఁదాక దైత్యభూత
ములను బిండిగాఁగొట్టి సమ్మోదమలర
నింద్రజిత్తునిమీఁదికి నెగయలేదె!—హరి॥

సీ॥ శౌర్యధీనిధి మేరుసమధైర్యవంతుఁడు
మేఘనాధుఁడుదాకి మేటి బాణ
ములనుఁ బ్రయోగించి మూర్ఛవోవఁగనేయ
నదరంగఁ గొట్టిన నరసి త్రాణ
గల శిలీముఖములఁ గ్రౌర్యంబుతోనేయ
ధ్వజమెత్తి నీవటు దారుణరణ
మొనరించి యసురేంద్రు నోడింప విసుఁగొంది
నిశ్చేష్టుఁడై వాఁడు నిలచి తరుణ
కాలమనుచు బ్రహ్మాస్త్రంబుఁ గడిమి నేయఁ
గలుగ నద్దానితో నీవు గట్టువడవె!—హరి॥

సీ॥ బ్రహ్మాస్త్రమహిమచే బంధింపఁబడనీవు
కొనిపోఁడె దనుజేంద్రు గూర్మిసుతుఁడు
రాకాసిమూఁకయు రావణుండును గడు
చోద్యంబుగా నినుఁజూడ నపుడు
దుముకఁ గట్లన్నియుఁదొలఁగఁగ వాలంబుఁ
బెంచి పీఠంబుగాఁ బ్రీతితోడ
రావణేంద్రునిమ్రోల రమణీయముగఁ గూరు
చుండి సీతులుఁజెప్పఁ జూచి వాఁడు
పండ్లు బటపటఁ గొఱకుచు 'పాడుకోఁతి'
నాలుకనుఁ గోయుఁడన నీవు నవ్వలేదె!—హరి॥

సీ॥ రామదూతను నిన్ను రాక్షసేంద్రుఁడు జంప
సమకట్ట నా విభీషణుఁడుజూచి
'దూతఁ జంపఁగరాదు దోషంబు ప్రాప్తించు'
నని భ్రాతకునుఁజెప్ప నట్టెలేచి
మండిపడుచువచ్చి మర్కటవాలము
న కనలముంపుడనంగ వేగ
దనుజాధములుగూడి తైలవస్త్రంబునుఁ
జుట్టి తోఁకకుఁ జిచ్చుఁబెట్ట నద్ది
మంటలెగయంగ నొక్కింత మ్రానువడక
లంకఁ గాల్చినయట్టి వలంతివౌర!—హరి॥

సీ॥ లంకను దహియించి బింకంబు వహియించి
గడియలోపల సీతఁగాంచి యామె
వృత్తాంతమంతయు విశదంబుగాఁగొని
వనధిదాటుచు గడుధ్వనులచేత
భూనభోంతరముల ధ్వానంబు లెగయంగఁ
జేయుచు వచ్చిరఁ జెలఁగి కోఁతు
లన్నియుఁ దిలకించి యానంద ముప్పొంగ
నగురుచువచ్చి నీ యెడలఁజేర

జానకినిఁగన్న వృత్తాంత సరణితోడ
లంకఁగాల్చినవిధముఁ దెల్పంగలేదె!—హరి॥

సీ॥ సంతసించుచు వారు గంతులువైచుచు
నిన్నుఁ గౌఁగిటఁజేర్చి నీ వివేక
బలములఁ గొనియాడి, పౌరుషంబు నుతించి
సీతాశిరోమణిఁ జేతఁబట్టి
గడుమొక్కి శ్రీరామకార్యంబు సఫలంబు
నొందినదనుచు నానందమొంది
అధిపుండు సుగ్రీవుఁ డధికహర్షంబందు,
రఘుకులవరుఁడు గరంబుమెచ్చి

మేలుసేయును దడయంగనేల యింక
ననుచు నినుఁ జేరిగొల్వరే యధికభ క్తి!—హరి॥

సీ॥ గడువుదినములకుఁ గడువేడ్కతో వచ్చి
కంజాక్షు శ్రీరాము కాళ్లనంటి
మ్రొక్కి, జానకివార్తఁ జక్కగా వినుపించి
శ్రీ శిరోమణినిచ్చి "సీతఁగంటి
'నెలరోజులకు మీరు నెలవుకు రాకున్నఁ
దనువుఁ బాసెద'నని తల్లి వింటె"
ననరామచంద్రుండు నట్లు దుఃఖించంగ
'నోరిమినొందుఁడీ యొక్క గంట
లోన సీతను దెచ్చెద నేన'నంగ
రామభద్రుండు మెచ్చె నీ స్వామిభక్తి!—హరి॥

సీ॥ వివిధమర్కటజాతి నివహంబులను వేగ
రప్పించి జానకీరాము కార్య
సాఫల్యమునకునై సంతసంబందుచుఁ
గపివీరులందఱుఁ గడఁగి శౌర్య
గాంభీర్య సాహసక్రమములఁ జూపింప
గంతులువైచుచుఁ గడమి క్రౌర్య
ములఁ బల్కుచునుఁ జాల ముచ్చటగా యుద్ధ
సన్నద్ధులై యుండ సమధి కార్య
వరుల చరితంబులను దెల్పు చరులఁ గూల్ప
సైన్యనాధుండవై నీవు జనఁగ లేదె!—హరి॥

సీ॥ అది యేమిజోద్యమో యమ్మహోవనధిపై
వింతవారధిఁగట్టి వెలసితిరట!
అతి విశాలంబులౌ నద్రీంద్రములఁదెచ్చి
నీఁటిపై వింతగ నిల్పితిరట!
వృక్షరాజంబుల విరివిగాఁ బెకలించి
సుగమంబుగాఁ ద్రోవఁ జొన్పితిరట!
అతి వినోదంబుఁ జిత్రాంచితంబును నౌచుఁ
దేలియాడు తెరవుఁ దీర్చితిరట!

యెటుల వారధినిల్పెనో! యెటులమీరు
గట్టినారోకో! వర్ణింపఁగాదు నాకు—హరి॥

సీ॥ శతయోజనశరధి సైన్యవితతిదాటి
విడియ రక్షకుఁడవై వెలసినావు
రాత్రించరాళి తరలి యెదుర్కొనకుండఁ
బ్లవగాళికోటవై బరగినావు
రక్కసినివహంబు రావణుండు వెఱవ
విశ్వరూపునఁగాపు వెడలినావు
రామలక్ష్మణులల గామరూపుల గంటఁ
బడకుండ బంటువై నడచినావు

స్వామికార్యంబునందింత శ్రద్ధజేసి
రామదాసాగ్రగణ్యా గౌరవముఁ గంటి!—హరి॥

సీ॥ మోహరంబున రిపువ్యూహంబులనుఁజించి
ప్రళయాంతకునిగ గన్పడితి, దిశల
నొకప్రక్క నుద్దండయుద్ధభటుండవై
గోఁతిమూకనుఁ బురిఁగొల్పి, రిపులు
రామలక్ష్మణులనుఁ గామరూపంబునఁ
జెనకుదురని యెంచి జిత్తమటులఁ
జేర్చి బోధించుచు, ననిఁ జిత్రంబుగఁ దిరిగి
కపుల బ్రాణంబులఁగాచి, సురలుఁ
బొగడ, దైత్యులు మొఱఁబెట్ట, బొల్చుభీతిఁ
బారఁజేయవె యాశ్చర్యభండనమున—హరి॥

సీ॥ 'శ్రీ లక్ష్మణస్వామిఁ జేకొని తరలిన
మఱియు రాఘవుఁ డనిమానిచింత'
నని రావణుండాజికరుదెంచి రయమున
లక్ష్మణుఁదాకిన, లాఘవంత
మైన శరాళి దేహంబు దుళ్లఁగనేయ
ఘోరశక్తినివైచి గూల్చి గంతు
వేసి యెత్తుకొనంగ విఫలుఁడై యత్నింప,
నెటనుండియో నీవునేగి చెంత
ముష్టిఁ బొడువంగ దనుజుండు మూర్ఛవడడె!
నియతి నీశక్తి నెంత వర్ణింపఁగలను!—హరి॥

సీ॥ అమ్మహాశక్తిచే నడుగంట బ్రాణముల్
సౌమిత్రి ధరఁబడ రాముడంత
చిరదుఃఖభరమున దురపిల్లుచుండఁగఁ
గపివీరులందఱుఁ గాంచి చింత
నూనినవారలై 'వానరశ్రేష్ఠుండు
సంజీవిఁ దెచ్చిన స్వామి వింత
గా లేచు'నని, చేతఁగామికి సిగ్గిలి
యూరకనుండ, నే నుర్వివంతఁ

గలయ వెదకియుఁ దెచ్చెద ఘనునిఁబ్రోవ'
ననుచుఁ ద్రోవగ్రహించి నీ వరుగలేదె!—హరి॥

సీ॥ శ్రీరామునార్తికిఁ జింతించి చింతించి,
సౌమిత్రి మూర్ఛకైఁ జాలవగచి,
సీతామహాదేవి స్థితికైన యోజించి,
కౌసల్యాశోకంబుఁ గడుఁదలంచి,
జనకు దుఃఖమునకుఁ జాల విచారించి,
భరతశత్రుఘ్నుల పాటువెంచి,
'ఇనవంశ మతిదుఃఖమును బొందు నివ్వేళ
రక్షింప నద'నని గాముఁ దలఁచి,

'అరుణకాలంబునకుమున్న యౌషధులను
దెత్తు'ననుచును నీవటుఁ దేరిచనవె!—హరి॥

సీ॥ అల సమీరునికంటె నధికమౌ వేగంబు
నను బోవుచుండంగ దనుజుఁడొకఁడు
రావణుబంపునరయమున నేతెంచి
మునివేషధారియై వనమొకండు
ఘనముగా సృష్టించి 'హనుమంత యిటురమ్ము'
సౌమిత్రిలేచెను, రాముఁడిపుడు
మోదితుం డాతిథ్యమును గొనిపొమ్మన
'దాహమిమ్మ'న నీవు దనుజుఁడపుడు
తన కమండలూదకముఁ గైకొనుమనంగ
మాయ గ్రహియించి 'వలదని' మడుగుఁగంటి!—హరి

సీ॥ కపటమునీంద్రుండు గమలాకరముఁజూప
జలపానమునుసేయు సమయమందు
మదమకరీంద్రంబు మరుఁగుగా నేతెంచి
త్వత్పాదములఁబట్టి దడయకందు
లాగగాగన్గొని లావుకుమెచ్చుచుఁ
దడయగరాదని దలఁచి ముందు
మశకమైఁ గుక్షిలో మాటుగదూరియు
మొసలిపేగులఁ జీల్చి మోదమంద
గ్రాహము మృతించి గంధర్వకాంతగాగ
నిలచి ధ్యానించి చెప్పదే నిజచరిత్ర!—హరి॥

సీ॥ మదఁగులో మకరిని మర్దింపఁదొడఁగిన
యంగన యదొక్కటి యసురమాయ
విశదంబుగాఁ దెల్పి విను వీధి కేగినఁ,
గ్రోధానలీవేగఁ గోర్కెనతఁడు
రూపభేదంబుల రుసరుసలాడుచు
'నిన్ను భంగముసేయ నేర్తు'ననఁగ
వాని నిలంగూల్చి వాయువేగంబున
సంజీవిగిరిఁ జేరి సంబరమున

గరుడ గంధర్వ కిన్నర కామినులునుఁ
ద్రిదశయక్షులుఁ బరికింప దీప్తిఁగనవె!—హరి॥

సీ॥ ఓషధీంద్రముఁగన నాశ్చర్య విద్యుత్ప్ర
భాతీతపటలమై ప్రబలునొకట
నరుణప్రభాపుంజ మావహిల్లు నొకప్పు
డింద్రనీలద్యుతి నెసఁగునొకట
ధావళ్యరుచులచేఁ దాండవం బాడుచు
శ్యామలరీతిమై నలరునొకట
కోటి సూర్యద్యుతి, కోటి చంద్రప్రభ
రేకెత్తఁగా దేజరిల్లునొకట

వివిధకాంతుల విలసిల్ల వేడ్కఁ జెంది,
యరయలేకను సంజీవి నద్రిఁగొనవె!—హరి॥

సీ॥ ఘోరవక్రగ్రహా క్రోధానలపుశక్తి
వాతఁబడినఁగూడ భీతిలేదు
కర్కోటక ఘోరకపటుండు దైత్యుండు
కాలనేమివిశిఖఁ గదలలేదు
గరుడకిన్నరయక్ష గంధర్వ వరముఖ్య
విద్యాధరులకైన వెఱవలేదు
చిత్రప్రభావ సంజీవిదీప్తులఁగాంచి
యబ్బురపడి వెన్క కరుగలేదు

వైరులనుజెండి మూలికవర్గుఁజూచి
పర్వతమునంతఁ బెకలించు ప్రౌఢిఁగనవె!—హరి॥

సీ॥ ఔషధగిరిచర్య యాశ్చర్యమునముంప
సంజీవి యిదియను సంజ్ఞలేక
మాఱ్పడి శ్రీరాము మదిలోన స్మరియించి
విశ్వరూపంబున వెలసి తోఁకఁ
బెంచి బర్వతమునుఁ బెకలించి దోఁకతో
బంధించి యినుమంత బరువులేక
కందుకక్రీడగాఁ గరమున ధరియించి
తీవ్రశక్తి సవిత్రుదీప్తిరాశ

పూర్వమటఁజేరి సౌమిత్రి మూర్ఛఁదీర్చి
నిలచితివి రాముమ్రోల నంజలి ఘటించి!—హరి॥

సీ॥ సౌమిత్రిజీవింప సంతసంబున రాముఁ
డాలింగనముఁ జేసి యభినుతించి
'నీ పరోపకృతికి, నేస్తంబునకు ఋణ
బడితి'ని నిగ్గడుఁ బ్రస్తుతించి
'ముల్లోకములజనుల్ ముందుగా నీదర్శ
నముఁ జేసి తనుఁజేరఁ బ్రముదమం'చు
వచియించి తన కృపావారాశి విమలత
రంగ పంక్తిని మునుగంగనుంచి
తేల్చెడోకో! నీదుపుణ్యంబుఁ దెల్పవశమె!
నీ దయామృతరసము నామీఁదజల్లు!—హారి॥

సీ॥ మొదట రాఘవునితో ముచ్చట లొనరించి
సద్గుణుండనిచూచి సఖుఁడవైతి
రాజాధిరాజని రాత్రింబవళ్లును
బరిచర్యసేయు సేవకుఁడవైతి
వీరవర్యుండని వేదాంతవిదుఁడని
కార్యసాహాయ్యత ఘనుఁడవైతి
భగవంతుఁడని మెచ్చి పాదకంజమ్ముల
భక్తితో నర్చింపఁ బాయవైతి
సఖ్య, భృత్యవిజ్ఞాన, నిష్కామ, మోక్ష
తత్త్వములు వర్ణనలుసేయుఁ దరమెనాకు'—హారి॥

సీ॥ అనితరలభ్యంబు నతిశుభదంబగు
సంజీవిఁదెచ్చిన శక్తివంత!
ఎవఁడు దాటనివార్ధి నవిరళగతిఁదాటి
జానకిం గనుఁగొన్న సత్యవంత!
నిత్యసంచారియై నెగడు భాస్కరుజెంత
విద్యలఁగన్న వివేకవంత!
సకలదేవాళికి సంతసంబొనరించి
శాశ్వతాయుఁడవైన చారువంత!

రామ సౌమిత్రులకు ముందు రాజసముగ
బహుళవినుతులఁ గొనియెడి భాగ్యవంత!—హరి॥

సీ॥ కపిశేఖరుండేడ! విపుల భక్తిజ్ఞాన
వైరాగ్యసంపత్తి వరలుటేడ!
మర్కటవిభుఁడేడ! మహిమాన్వితంబైన
బ్రహ్మచర్యపుదీక్షఁ బ్రబలుటేడ!
హరికులోత్తముఁడేడ! నాశ్చర్యమైనట్టి
వర చిరంజీవన బిరుదమేడ!
కోఁతికులుండేడ! కోరిన వరమిచ్చి
దేవోత్తముండని దెలియుటేడ!

శౌర్యమదియేడ! దనుజులఁ జంపుటేడ!
వింతయగు నీ చరిత్రంబు వినినకొలఁది!—హరి॥

సీ॥ నీ పాదధూళికై నేఁడు నీదరిఁజేరి
సేవింపవచ్చితి శ్రీయమొసఁగు
నీ దర్శనమునకై నే నాసఁగొనిపజ్జ
స్మరియింపవచ్చితి శరణమొసఁగు
నీ మహాభక్తికై నిశ్చలంబుగ దాపు
వసియించి భజియింతు వరమొసంగు
నీ కృపారసముకై నీచెంతఁజేరి నీ
లీలఁ గీర్తించెద మేలొసంగు

రామునకుఁ బ్రియుఁడవనుచు నామనంబు
నందు నిను నమ్మిగొల్చెద నభయమిమ్ము!—హారి॥

సీ॥ శ్రీరామునకుఁ బ్రీతిఁజేయంగఁ దలఁపోసి
రాక్షసాళిఁ బరిమార్పంగలేద!
జనకాత్మజకుఁ బ్రీతిజరుపంగ నూహించి
బలుకష్టసంతతుల్ బడయలేద!
కపివీరునకుఁ బ్రీతిఁగల్పింప యోజించి
యతనితోఁ గానకు నరుగలేద!
సౌమిత్రికినిఁ బ్రీతిసలుపంగ మదినెంచి
సంజీవిఁదెచ్చి యొసంగలేద!

హితముఁజేయంగ నీకంటె నెవరుగలరు?
దరినిఁజేరితి నామీఁద దయనుజూపు—హారి॥

సీ॥ రామకార్యంబన రంజిల్లఁ జేతువు
నాదుకార్యంబన నవ్వెదీవు
రామనామంబన రమణీయముగ నెంతు
నాదునామంబన నడచిరావు
రామరూపంబనఁ గామించిచూతువు
నారూపమనగను బారెదీవు
రామవాక్యంబన రాజిల్లివినెదవు
నాదువాక్యంబన నమ్మలేవు
పరిభువుకన్నను సద్భక్తి విభవమొప్పు
సేవకునుడి హెచ్చనుచు యోజింపలేవె!—హరి॥

సీ॥ భూమిజారాములుఁబూజ్యసింహాసనా
రూఢులై యుండ నిరూఢభక్తి
నతినమ్రగతి మెయి నంజలి ఘటియించి
వాలంబుముడిచి శోభాప్రసక్తి
శిరముఁ గ్రిందికివంచి జిత్తమొక్కటిజేసి
భయభక్తులేకమై బరవశోక్తి
విలసిల్లి బంటువై వేడ్కతో శ్రీరాము
లను గొల్చుచుండవే లక్ష్యయుక్తి
వారిఁ బ్రేమను గ్రహియించి భూరిమహిమ
నలరుచుండవె జగతి మహానుభావ!—హరి॥

సీ॥ నీ మహాతత్త్వార్థ నిర్ణయంబునఁగాదె
శ్రీరాముఁ డాగమ శ్రేణిఁజెపుట
నీ మహాసత్కార్య నిపుణతకైగాదె
రఘుకులోత్తముఁ డాదరముఁగనుట
నీ మహాసద్భక్తి నిశ్చలగతిఁగాదె
శ్రీరఘూద్వహుఁడు నిశ్చేష్టుఁడగుట
నీ మహాపరిచర్య నిక్షేపమునఁగాదె
రాముఁ డానంద విభ్రాజియగుట

నీ మహత్త్వంబునకుఁగాదె నిరతమిలను
ముందు నీదర్శనముఁజేయ మోక్షమనుట! — హరి॥

సీ॥ పేరు మర్కటరాజు బెను జితేంద్రియమతి
యిల బ్రహ్మచర్యాశ్రీ మెవనివశము!
పేరు వానరపతి ధీరుండు భక్తుండు
నెఱుఁగ నాత్మసాక్షాత్కార మెవనివశము!
పేరు లాంగూలుండు భీషణవీరుండు
నెన్న జయమనిశ మెవనివశము!
పేరు ప్లవఁగు డతి ప్రియహితైకచణుండు
భువిఁ గార్యదక్షత యెవనివశము!

రామునకు ముందు దర్శనస్వామియగుట
యెవనివశమౌను నీకెగా నెఱుఁగనెఱుఁగ! — హరి॥

సీ॥ సీతామహాదేవి శ్రీరామముద్రనుఁ
జేకొని చిరకాల జీవమిడదె!
సీతామహాదేవి చెలఁగి మీ సాహాయ్య
సంపత్తికిని రత్నసరములిడదె!
సీతామహాదేవి శ్రేష్ఠమౌనీసేవ
లకు రత్నకల్లాయి లాగులిడదె!
సీతామహాదేవి చెలువారు నీనయ
గుణవితతికి ముద్దుకొనుచుకువనదె!

సతము జానకీరాముల సత్కృపాప్ర
సారమందె దెంత యదృష్టశాలివయ్య!—హా॥

సీ॥ అని నీదు శౌర్యధైర్యాదు లెంచుదమన్న
నిన్నెదిర్చి పరుఁడు నిలువలేడు
ధర నీదు సాహసౌదార్య మెంచుదమన్న
నీ కీడుజోడు గణింపలేడు
అల నీదు భక్తివిద్యాదు లెంచుదమన్న
నినుఁబోలునట్టి మనీషిలేడు
ధృతి నీదు పరహితవ్రతము నెంచుదమన్న
స్వార్థరహితుఁడు నీ సాటిలేడు

నీ ప్రభావవిశేషంబు నేర్చునెవఁడు!
ఘనతరానన్యకీర్తి సంజనితమూర్తి!—హా॥

సీ॥ విశ్వరూపంబున వీరుండవై హెచ్చి
విస్తరింప సభము పెరిగిపడదె!
రోదసీకుహారంబు ఖేదభావంబంద
రవి చంద్ర తారాదు లవిధిఁబడవె!
భూమి గిఱ్ఱునఁదిర్గు, ఘోరున సంద్రముల్
గల్లోలయుతములై గదలిపోవె!
దానవానీకంబుఁ దల్లడిల్లుచునుండ
నారుల గర్భముల్ జారిపడవె!

సురలు, మునులును వణకుచు స్తోత్రములను
సేయు భీకరరూపానఁ జెలఁగుదార!—హారి॥

సీ॥ భువిఁ బరహితకారి బూజ్యుండు నెవఁడన్నఁ
దొలుత నీనామంబుఁ బలుకవలయు
వర కార్యదీక్షచేఁ బరఁగువాడెవఁడన్న
నాదిని నీపేరు ననఁగవలయు
వినయవిధేయుండు వీరుండు నెవఁడన్న
శీఘ్రింబ నీపేరుఁ జెప్పవలయు
పరమవేదాంతి సద్భక్తుండు నెవఁడన్న
వడివడి నీపేరు నుడవవలయు

నిండు దయఁజూపు దేవుం డెవండటన్నఁ
దొలుత నీపేరు వచియింపవలయు సుమ్మ!—హారి॥

సీ॥ భానునోద్దకునేగి బ్రహ్మాండమంతయుఁ
జౌకళించిన రూపుఁ నాకుఁజూపు
సంద్రంబుదాటెడు సమయంబునందుండు
భీకరరూపంబు నాకుఁజూపు
భూమిజ 'నమ్మను, పో'మ్మన్న గగనంబు
దాకఁ బెంచినరూపు నాకుఁజూపు
సౌమిత్రిఁ బ్రతికింప సంజీవికరిగిన
నాటి యుత్తమరూపు నాకుఁజూపు

దినము నీ భక్తవరులకు దివ్యదర్శ
నంబు దయసేయురూపంబు నాకుఁజూపు—హారి॥

సీ॥ శ్రవణగానముఁజేసి చక్కగారమ్మ వీ
రాంజనేయా! యన్న నగపడవుగ
అతినుతిఁగావించి యాదరమ్మున రమ్మ
హనుమంత! యనివేఁడ నగపడవుగ
ప్రీతితోఁ బ్రణతులర్పించి రమ్మకఁ బవ
నాత్మజా! యనిబిల్వ నగపడవుగ
ధ్యానతో నాసతోఁ దవిలి కేసరి తన
యా! రమ్మటంచన్న నగపడవుగ

యెటుల బిల్వంగవలయునో-యేమి సేయ
వలయునో నన్నుఁ దయఁజూడ వాయుపుత్ర!—హారి॥

సీ॥ బాల్యంబులో నింత బాగోగు లెఱుఁగక
నాటపాటలయందు నాసఁజెడితి
యౌవనోదయమందు సందమౌ యువతుల
ముద్దు ముచ్చట్లతో మోహపడితి
ముదుసలితనముఁ బుత్రపౌత్రులతోడ
మురిపెంబులాడుచు మోదపడితి
దారాసుతాదులుఁ దనువు శాశ్వతమంచుఁ
జెడుగతుల ధనముఁ జేరనిడితి

నొక్కదినమైన నీనామ ముచ్చరింప
సమయ మెఱుఁగను జన్మజన్మములయందు—హరి॥

సీ॥ భువి విషయాసక్తమోదినై పాపఁపుఁ
బంకిలంబునఁబడి బందినైతి
కామాది షడ్వర్గకాంక్షలకునుఁ జిక్కి
చచ్చుచుఁ బుట్టుచు శవమునైతి
జ్ఞానబాహ్యేంద్రియ చలనంబునకుఁజిక్కి
సంసారవహ్నికి శలభమైతి
నిత్యమనోబుద్ధి నియతవిభ్రమణాది
కాజ్ఞానములఁజిక్కి యంధుఁడైతి

జడతవీడినసేవ యొక్కఁడెగణింప
ముక్తిసాధనమంచు సద్భక్తిఁగంటి—హరి॥

సీ॥ ఉదయంబుననలేచి ముదముతో వండుచుఁ
దినుచుఁ బండుచు నిన్నుఁ దెలియలేదు
దారాసుతాదుల, ధనమోహములనమ్మి
శాశ్వితంబంచు నీ స్మరణలేదు
వ్యర్థప్రసంగాళి నాసతోసల్పుచుఁ
బొద్దుపుచ్చుచు నిన్నుఁ బొగడలేదు
వృథమైన చుట్టాలవిందు పొందులలోన
స్థిరమతి నిన్నుఁ బూజింపలేదు

యిట్టిమూఢుఁడ నాత్మజనేచ్ఛఁ దవిలి
యుంటి, భవబంధవిచ్ఛేద మొందుటెట్లొ!—హరి॥

సీ॥ రామభక్తుఁడవంచుఁ బ్రేమించి నీ పాద
భక్తుండనై తిని బట్టిచూడు
రామదాసుఁడవంచు రంజిల్లి నీ పాద
దాసుండనై తిని దయనుఁజూడు
రామసేవకుఁడంచుఁ గామించి నీ పాద
సేవకుండై తిని చేరిచూడు
రామశిష్యుఁడవంచు రాజిల్లి నీ పాద
శిష్యుండనై తిని జీరిచూడు

రామకరుణావలోకన రాశివగుట
నీదు గరుణావలోకన మోదమిడదె!—హరి॥

సీ॥ కోఁతిరూపుఁడవైన గుణములో నెంచంగ
సజ్జనశ్రేష్ఠులు సాటిరారు
అడవిమానిసివైన నచ్చంపుబత్తిలో
సకలమునీంద్రులు సాటిరారు
మృగశాబకంబైన నిగమాంత తత్త్వవి
జ్ఞానంబునను బుధుల్ సాటిరారు
భటపతివైనను భయరోగములఁ బాపు
శక్తిలో హరిహరుల్ సాటిరారు

గుణగణంబుల సరిరారు గోటిసురలు
నీకు నీవొక్కఁడవె సాటి యో కపీంద్ర!—హరి॥

సీ॥ శ్రీరామపాదరాజీవసన్నిధి రెండు
హస్తముల్ జోడించి, మస్తకమును
వంచి, నిర్మలమైన వరచిత్తశుద్ధితో
భక్తి సేవింపంగఁ బ్రబలముగను
సరససుధావృష్టి స్వచ్ఛమై పూతమై
వ్యాపింప స్వామియుఁ బరవశమున
గారాబమునుఁ బెంప 'శ్రీరామ' యని నీవుఁ
దన్మయత్వంబునఁ దనరువేళఁ

జూచువారలు, వినువారుఁ జోద్యమంద
నొక్కఁడొక్కరు మిళితులై యుండవొక్కొ!—హరి॥

సీ॥ నీ పూర్ణకృపసుధాసేకంబు వెదజల్లి
యానందమునుగూర్పు మాంజనేయ!
నీ యవారితభక్తి నిశ్చలత్వంబున
నాహ్లాదమునుఁదార్పు మాంజనేయ!
నీ వేదవిస్ఫులార్థ నిర్ణయతతిఁ దెల్పి
యైక్యభావమునేర్పు మాంజనేయ!
నీ జ్ఞానపాండిత్య నియతిబోధనసల్పి
యాత్మహితముఁదీర్పు మాంజనేయ!

నీ యఖండ విమలతపోనిష్ఠఁజేర్పు
మనుదినంబును మ్రొక్కెద నాంజనేయ!—హరి॥

సీ॥ శక్తిమంతుఁడవైతి శరధిదాటుటలోన
నౌషధగిరి నెత్తినట్టిదేఁగ
బుద్ధిమంతుఁడవైతి భూరి శాస్త్రపురాణ
వేదాది విద్యల విధమెఱుంగ
బ్రహ్మవేద్యుఁడవైతి భక్తివిజ్ఞానముల్
వైరాగ్యసంపద వర్ధిలంగ
స్థిరజీవివైతివి వర జితేంద్రియశక్తిఁ
దగ బ్రహ్మచర్యవ్రతంబుసల్ప

కార్యదక్షుండవైతి వఖండకీర్తి
దాయకము రామకార్యసాధనమొనర్ప—హరి॥

సీ॥ నీ మహాసత్కార్య నిర్ణయవితతికి
నాదిశక్త్యంతటి యనఘురాలు!
నీ సుజనత్వంపు నేర్పరితనమున
బ్రహ్మదేవుండెంత ప్రాభవుండు!
నీ పరహితభావనియతివిశ్రేణికి
శ్రీవిష్ణువెంతటి భావపరుఁడు!
నీ మహావిక్రమ నిర్ణితోత్తమయుక్తి
మినుసిగవేల్పెంత మేటివాఁడు!

సుగుణములయందు ముక్కోటిసురలుఁబోల్ప
నెంతవారలు శ్రీ హనుమంత నీకు!—హరి॥

సీ॥ శ్రీరామపద సరసీరుహంబులనమ్మి
నిల్చితివేయట్ల నిల్చినాను
శ్రీరామ దర్శనశ్రీయలాలసుఁడవై
నిల్చితివేయట్ల నిల్చినాను
శ్రీరామచంద్ర సుస్థిరకృపాదృష్టికై
నిల్చితివేయట్ల నిల్చినాను
శ్రీరామవాక్సుధాధారాంబువులఁగ్రోల
నిల్చితివేయట్ల నిల్చినాను

నీవు రాముని నమ్మంగ, నేను నిన్ను
నమ్మినాఁడను దయఁజూడరమ్ము వేగ!—హరి॥

సీ॥ తారకమంత్రార్థసారంబు గ్రహియించి
దాసోహమని పాదదాసునైతి!
తారకజప సంవిధానంబుఁ గన్గొని
దాసోహమని రామదాసునైతి!
తారకమాధుర్యధారలఁ జవిఁగొని
దాసోహమని భక్తదాసునైతి!
తారకనామ విస్తారశక్తిని నమ్మి
దాసోహమని జ్ఞానదాసునైతి!
తారకపుమంత్ర ముఖ్యతత్త్వంబుఁ దెలియ
నీకు హరునకుఁ దక్కను నాకు వశమె!—హరి

సీ॥ నాకుఁ బ్రత్యక్షంబుఁ గాకయుండుటచేత
నీరూపు వర్ణింప నేరనైతి
పెద్దలచిత్తర్వు లద్దంపుసుద్దులు
విని చేతనైనంత వెలువరచితి
భక్తిలేశంబైన శక్తిజాలకయున్నఁ
బట్టుపట్టియు నీకుఁ బ్రస్తుతిడితి
స్వప్నసుషుప్త్యాద్యవస్థలందైననుఁ
గాన్పింతువోయని గనుఁదెఱచితి
నెపుడుఁ బ్రత్యక్షమౌదువో-యెపుడు నేను
గన్నులార దర్శింతునో-కన్నతండ్రి!—హరి॥

సీ॥ పంతమా గడు బలవంతమా పట్కావు
సుంతైన హనుమంత వింతయేల!
న్యాయమా గవరావు శ్రేయమా దాగంగ
హేయమా నాయెడ మాయలేల!
కోపమా నాయందుఁ గోప్యమా నాముందు
చపలమా నాపట్ల శపథమేల!
కష్టమా మిగుల నయిష్టమా నాచెంతఁ
గావవా నామీఁదఁ గ్రౌర్యమేల!

నేరమానాది రమ్మనఁ బారనేల!
యేలుమాయన్న నెడఁబాసి యేగనేల! — హరి॥

సీ॥ ఈదినంబిత్తువో యేదినంబిత్తువో
త్వద్దర్శనంబంచుఁ దలఁతునెపుడు
రేపు బూరింతువో మాపు బూరింతువో
త్వత్కృపార్ఘురియంచుఁ దలతునెపుడు
ఇపుడు దావింతువో యెపుడు దావింతువో
త్వన్నామ సుధయంచుఁ దలఁతునెపుడు
ఈక్షణంబబ్బునో యేక్షణంబబ్బునో
త్వత్పాదసేవంచుఁ దలఁతునెపుడు

నొక్కటియు నింతదనుకనుఁ జక్కఁబడదు
కోర్కెలన్నియుఁ గొంతెమ్మ కోర్కెలయ్యె! — హరి॥

సీ॥ శస్త్రపరాక్రమశాలి సుగ్రీవున
కింతరాజ్యముఁ గూర్చు టేమికీర్తి!
భువనరక్షణకళాపూర్ణుడౌ రామున
కింత సాయముఁ జేయు టేమివింత!
స్థిరచిత్తసంకల్ప సీతామహాసాధ్వి
కింత శోకము మాన్పు టేమిగొప్ప!
సాహసోత్సాహ విస్తరకీర్తి సౌమిత్రి
కింత మూర్ఛనుదీర్చు టేమిఘనము!

నన్ను నన్యగతికుని నాపన్నజనునిఁ
కరుణఁ గనుటొండె సత్కీర్తికరముగాక!—హరి॥

సీ॥ ఈ మందభాగ్యు నింకెట్లుగాఁ బ్రోతువో
స్థిరభక్తి నినుఁ బ్రశంసింపలేఁడు
ఈ యవివేకి నింకేరీతిఁ జూతువో
భావించి నీయున్కిఁ బలుకలేఁడు
ఈ యసత్యాచారు నెటు గడతేర్తువో
గడుభక్తి నీపేరు నుడువలేఁడు
ఈ బుద్ధిహీనాత్ము నెట్లుద్ధరింతువో
విషయమాయలఁబడి వీడలేఁడు

యిట్టి మలినాత్ము, నజ్ఞాను నేవిధానఁ
గరుణఁగాంతువో యెఱుఁగ విఖ్యాతచరిత!—హరి॥

సీ॥ దర్శనంబిచ్చినఁ దగనీయకుండిన
నమ్మి ప్రార్థించుచు నతులొనర్తు
కనులఁగాన్పించినఁ గాన్పింపకుండినఁ
జిత్తంబునిల్పి జే జే లొనర్తు
దయతోడఁ దన్పిన దయఁ దన్పకుండిన
ఘనభక్తిఁ బాదసేవన మొనర్తు
కనులెత్తిచూచినఁ గనులెత్తకుండిన
ననిశంబు మదినిఁ బ్రార్థన మొనర్తు
వినులను నాదు మొఱవిన్న, వినకయున్న
నతి విధేయత నీకు జోహారొనర్తు! — హరి॥

సీ॥ కనులమూసియుఁ దారకపుమంత్రము జపించు
చును గనులెత్తవు స్తుతినొనర్ప
చిత్తమేకముఁజేసి స్థిరసమాధినిమున్గి
రాముఁజూచుచురావు ప్రేమఁబిల్వ
సర్వాంగకంబులు చలనంబులేకుండ
గూర్చొని మొఱవినఁ గోరవింత
స్వచ్ఛంపుభక్తికై సత్వకాంతివిశల
వెలుగఁగ నిటరావు వినుతిసేయ
నన్నుఁగానవు దరిఁజేరి నమ్మియుంటిఁ
బాదసన్నిధి సాష్టాంగబడితి శరణు — హరి॥

సీ॥ ఉన్నవపురిలోన నుజ్జ్వలమూర్తివై
భక్తాళికల్పమై బరఁగుహనుమ!
ఏకాండశిలపైని నేకశిలావృత
ప్రహరిగోడలమధ్యఁ బ్రబలుహనుమ!
రాజగోపాలుని రమ్యంపుగుడి పార్శ్వ
భాగంపుగుడిలోనఁ బరఁగుహనుమ!
అగణితమాహాత్మ్యమగు వీరరూపంబు
గాంచిలంగ భక్తులఁ గాచుహనుమ!

ఉన్నతాభయ వరముల నొసఁగుహనుమ!
వినుత రక్తి ముక్తులనిచ్చు వీరహనుమ!—హరి॥

సీ॥ ఘోరమహామార్మారి, కూరిరజాడ్యంబులుఁ,
బీడలు హతము నీపేరుఁజెప్ప
ఈతిబాధాళులు భీతావహంబులు
భిన్నంబులగును నీ పేరుఁజెప్ప
భయదదారిద్ర్యముల్ బాప సంఘంబులు
విచ్ఛిన్నములగు నీపేరుఁజెప్ప
ప్రాణాంతకపు బ్రహ్మరాక్షస భూతాది
భీతియడంగు నీపేరుఁజెప్ప

సకలబాధలుఁ గష్టముల్ వికలములగుఁ
దావకీననామాక్షరతతివచింప—హరి॥

సీ॥ ఉబుసుఁబోకకు నిన్ను నొకపరిఁ దలఁచినఁ
బాపసంఘంబులఁ బాసియుండు
నూరకఁగూర్చుండి యొకసారి దలఁచిన
భక్తిముక్తులతోడఁ బరఁగుచుండు
నుత్పాదములుఁదోఁప నొకతూరిఁ దలఁచిన
నిత్యశుభముఁగల్గి నిలిచియుండు
నులుకుగల్గినయంత నొకమారుఁ దలఁచిన
భీతియంతయు వీఁగి ప్రీతినుండు
పేరు నామాక్షరంబుల నిష్ఠతోడఁ
బలుకు నెవ్వఁడుఁగాని దివ్యప్రభావ!—హరి॥

సీ॥ ప్లవఁగనాయక! గొను ప్రణుతులశాంతింబు
వానర! గొనుము సద్వందనంబు
కపికులాలంకార! కైవారములుఁగొను
కోఁతిరాయఁడ! గొను కోటినతులు
శాఖామృగాకార! సాష్టాంగములఁగొను
కీశ! గొనుము నమస్కృతిశతంబు
ధరణిజాన్వేషక! దండంబులనుఁగొను
హరికుల! గొనుము నా యంజలులను
మునిజనాత్మీయ! గైకొను మొక్కులెల్ల
భక్తమందార! గొనుము నా ప్రణుతులెప్పుడు—హరి॥

సీ॥ మెరుపు మెఱయునగీతి మేనిచాయలఁదేలి
వర సరోజమువంటి వదనమొప్పి
కల్పశాఖలఁబోలఁగల్గు నాజానుబా
హువులతో ఘనమైన యురమునొప్పి
బాలభానునిదీప్తి భాసిల్లుచేలంబు
కటిభాగమునఁగల్గఁ గాంతినొప్పి
కాలపాశమునేంచు వాలంబుతో గ్రాలి
కనకకిరీటంపుఁ గళలనొప్పి

ముందుజూచిన పదమున నందమొప్పి
చేతఁబట్టిన వృక్షానఁ జెలువునొప్ప—హారి॥

సీ॥ శ్రీరాముని కమిత శేముషీప్రముదాయ!
త్రిగుణనిరూపాయ! తే నమోస్తు!
శ్రీ లక్ష్మణస్వామి జీవనాధారాయ!
దిననాథశిష్యాయ! తే నమోస్తు!
శ్రీ జానకీదేవి జీవహితైకాయ!
త్రిదశేంద్రవినుతాయ! తే నమోస్తు!
సుగ్రీవమిత్రాయ! శుభగుణహారాయ!
దివ్యావతారాయ! తే నమోస్తు!

దీనజన భక్తపోషాయ! తే నమోస్తు!
మానిజన చిత్తచోరాయ! తే నమోస్తు!!—హారి॥

సీ॥ ఆంధ్రరాష్ట్రాంగనోద్యత్కంఠహారస్థ
సన్మణి "ఉన్నవ" జన్మభూమి
ఉన్నవవంశమహోదధిచంద్రుండు
రామకృష్ణయ్య వరాలతాత
అతులగుణపవిత్ర యత్యుత్తమచరిత్ర
గణియింప వేంకాంబిక పితృమాత
సజ్జనశ్రేష్ఠుండు, సత్యుండు, భక్తుండు
వేంకటసుబ్బయ్య వెలయుతండ్రి
సాధ్వీమతల్లి, ప్రశస్త సద్గుణవల్లి
మహి రాజమాంబిక మాతృదేవి

యగుచు, సోదరిణులు నల్వు, రలఘువిదుఁడు
సోదరుం డొక్కరుండుఁ బ్రశోభఁదనరు
రామకృష్ణాఖ్యుఁడ నియోగిభూమిసురుఁడ
తతసుభక్తి నీ పద్యరత్నశతకంబు
నర్పణముసేతుఁ గొనుము వీరాంజనేయ!!

ప్రతులు వలయువారు :—

ఉన్నవ రామకృష్ణయ్యగారి కుమారుఁడు

బ్ర. శ్రీ. ఉన్నవ వేంకట సుబ్బయ్యగారు,

ఉన్నవ గ్రామము,

ప్రత్తిపాడు పోస్టు,

(గుంటూరుజిల్లా)

అని వ్రాయవలయును.

Printed at Sree Ramakrishna Press, Chirala.

